# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక




శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవి

ఏప్రిల్ 1994

Fax : 011-575-1303 ; Telex : 031-77145 ALFA IN ; Grams : SOUTH GUEST

✆ : 5722210 (6 Lines), 5739508 & 5722213, 5726725, 5722437

# హోటల్ సదరన్

( సదరన్ ట్రావెల్స్ వారి అనుబంధ సంస్థ )

అధునాతన సౌకర్యములతో తెలుగు వారిచే ప్రశస్తముగా నడుపబడుచున్న భోజన ఫలహారశాల మరియు విశ్రాంతి గృహమైన **హోటల్ సదరన్** లో మీరు ఢిల్లీలో ఉన్నప్పుడు బసచేయవచ్చును.

90 Rooms With Attached Bath & Dormitary Halls For Groups, Colour T.V. & Lift, Fax, Telex, STD/ISD Phones.

**TARIFF : Single Room Rs.190. Double Room Rs. 290.**

యాత్రలు :- మా అనుబంధ సంస్థ - సదరన్ ట్రావెల్స్ - వారు స్వంత డీలక్స్ వీడియో బస్సులలో ఢిల్లీ నగరం, తాజ్‌మహల్, మధుర, బృందావన్, బదరీనాథ్, కేదార్‌నాథ్, హరిద్వార్, సిమ్లా, జైపూర్, అలహాబాద్, వారణాసి, గయ, అయోధ్య మొదలగు స్థలములకు నిర్ణీత సమయములలో ఢిల్లీనుండి యాత్రలు నడుపుచున్నారు.

Our Super Delux Video buses & tourist cars are available on Contract for Tourists. Our receipts are approved for LFC/ Running LTC Tours in collaboration with India Tourism Dev. Corporation. ( Govt. of India undertaking )

Air/Rail Reservations are also Undertaken

వివరములకు

## Hotel Southern/Southern Travels

ఢిల్లీ లోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ

**18/2, Arya Samaj Road, Karol Bagh,**
**NEW DELHI - 100 005.**

బ్రాంచీలు :

1. హోటల్ అయోధ్యా బిల్డింగ్, లక్డీకాపూల్, హైదరాబాద్ - 500 004. (ఫోన్స్ : 223658, 227233)
2. హోటల్ హారాబిల్డింగ్, ( మద్రాసు సెంట్రల్ స్టేషనుకు ఎదురుగా ) మద్రాసు - 600 003. (ఫోన్స్ : 564864, 585253)
3. హోటల్ రాజ్‌కమల్ కాంప్లెక్స్, శివానంద్ స్టోర్స్ దగ్గర, కుమార్ పార్క్-ఈస్ట్, బెంగుళూరు - 1. (ఫోన్స్ : 267040, 262633)

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రికులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రికులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పై బడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం
ⓒ : 62
ప్రకాశం జిల్లా.

బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం
ⓒ : 3158 (S.T.D. 085195)
కర్నూలు జిల్లా.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకిలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫొటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రూ.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆరోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫొటో సత్రావరణములో పెట్టబడును.

రూ.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

భోజనశాల, ప్రార్థనా మందిరము, కళ్యాణ మంటపము, గోశాల, సమావేశ భవనముతో కూడా 109 వసతి గదులు గల ఈ సత్రము ఆదర్శవంతంగా నిర్వహించబడుచూ, నిత్యాన్న దానము చేస్తున్నదని తెలియజేయుటకు సంతసిస్తున్నాము.

రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రాలకు ప్రతి ఏటా ఒకటి లేక రెండింటికి రూ.50,000/-ల నుండి రూ.1,00,000/-ల వరకు ఆర్థిక సహాయము అందించాలన్న తీర్మానము సర్వసభ్య సమావేశముచే ఆమోదించబడినందున ఈ సత్రమునకు ఆర్థిక సహాయం చేసిన దాతలు పరోక్షముగా రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రములకు కూడా దానము చేసినవారు ఔతారు.

పై మూడు పద్ధతులలో ఏదో ఒక పద్ధతిన ఈ అన్న సత్రమునకు ఆర్థిక సహాయాన్ని అందించి దైవ కృపకు పాత్రులు కమ్మని సోదరులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

అన్నా సుబ్బ రంగయ్య
కార్యదర్శి

పోలిశెట్టి సత్యనారాయణ
అధ్యక్షులు

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969



సంపుటి
25



సంచిక
8



ఏప్రిల్ - 1994



సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి



ప్రాప్తిస్థానం
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప - 516 002.

# 'చంద్ర'కు శ్రద్ధాంజలి

ఉత్కృష్ట ఉద్యమ నిర్మాతల్లో శ్రీ చంద్రరాజేశ్వర రావు గారూ ఒకరు. భారత రాజకీయాకాశాన ఆయనది ధ్రువస్థానము. పాతిక సంవత్సరాలకు పైగా పార్టీ ప్రధాన కార్యదర్శిత్వ బాధ్యతను నిర్వహించిన ఘనతనే కాక, "ఆర్డర్ ఆఫ్ ఫ్రెండ్‌షిప్ ఎమాంగ్ పీపుల్స్", "ఆర్డర్ ఆఫ్ లెనిన్", "జార్జిడిమిట్రోవ్ ఆర్డర్", "స్టార్ ఆఫ్ పీపుల్ ఫ్రెండ్‌షిప్" మొదలగు పలు గౌరవ బిరుదులను పలు సోషలిస్టు దేశాల నుండి సముచిత సత్కారాలతో గడించుకొన్న ఘనత కూడా వీరిదే.

భారత వ్యవసాయ కూలీ సంఘ నిర్మాణము లోనూ, నిజాం వ్యతిరేక పోరాటం లోనూ, రాజేశ్వరరావు గారు ప్రధాన భూమికను నిస్తుల ప్రశంసనీయంగా నిర్వహించారు. కమ్యూనిస్టుల తొలి రాజకీయ పాఠశాలను నిర్వహించింది శ్రీ రాజేశ్వరరావే. శ్రీ రావు గారు కృష్ణా జిల్లాలో ఈ రాజకీయ పాఠశాలను నడిపారు. నిజాం నిరంకుశ వ్యతిరేక పోరాటములో ప్రముఖంగా నిలిచి ఎదురొడ్డిన శ్రీ రావి నారాయణ రెడ్డి, శ్రీ బద్దం బాలిరెడ్డి ప్రభృతులు ఈ రాజకీయ పాఠశాల నుండీ స్ఫూర్తిని పొందిన వారే. తెలుగు నాట సాగిన కమ్యూనిస్టు ఉద్యమాన్ని గురించి ఎవరు ఆలోచించినా "చంద్ర"లేని ఉద్యమమే కన్పించదు. ఈ సందర్భంగా సంస్మరించు కోవలసిన వారూ, తప్పక గుర్తుంచుకోవాల్సిన వారూ కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య గారు కూడ.

ధనార్జనే ప్రధాన ధ్యేయంగా సాగుచున్న ఈనాటి రాజకీయ వ్యవస్థలో అందుకు అణువంత కూడా స్థానమీయని స్వచ్ఛమైన నిస్వార్థజీవి శ్రీ రాజేశ్వరరావు గారు. "నాకు ఆస్తి ఏమీ లేదు. నేను ఎవ్వరికీ ఇవ్వనవసరం లేదు. ఇతరుల నుండీ నేనేమీ తీసుకోలేదు.

నా పుస్తకాలు పార్టీకి ఇచ్చి వేస్తున్నాను. నా బట్టలు అవసరం ఉన్న వాళ్ళకు ఇవ్వండి" - అంటూ ఆయన కమ్యూనిస్టు పార్టీకి వ్రాసిన చివరి లేఖలోని ఈ అంశాలే ఆయన నిస్వార్థతకూ, చిత్త శుద్ధికీ, హృదయ సంస్కారానికీ దృష్టాంతాలు.

తెలుగు వారంతా ఎప్పుడూ ఏకంగా ఉండాలనీ, తెలుగు వెలుగు దశదిశలా నిండి ఉండాలనీ చిత్త శుద్ధితో, భల్లూకపు పట్టుతో కృషి చేసిన ఆంధ్ర నాయకుల్లో శ్రీ రాజేశ్వరరావుగారు ఒకరు. అందుకే ఆయన విశాలాంధ్ర వాది. ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము రాష్ట్రములో ప్రభంజన వేగంతో లేచిన ఉద్యమాల ఫలితంగా ఏర్పడిన ప్రాంతీయ వైషమ్యాలు ఆయన హృదయాన్ని బాగా కలత బెట్టాయి. వాటిని అణచి, ఆంధ్రుల సమైక్యతకై పోరాడాడే కానీ వాటిని ఆధారం చేసుకొని లబ్ధి పొందాలని ఆయన రవంత కూడ ఆకాంక్షించ లేదు. కనుకనే ఆయన అందుకు గట్టిగా ప్రతిఘటించేందుకు తన పార్టీని సమా యత్తం చేశాడు. కమ్యూనిస్టుగా రాజకీయ జీవితాన్ని ప్రారంభించి కమ్యూనిస్టుగానే చివరి శ్వాసను విడిచిన గొప్ప సిద్ధాంత వాది శ్రీ రాజేశ్వర రావు గారు.

చల్లపల్లి జమీందారుకు వ్యతిరేకంగా జరిగిన రైతాంగ పోరాటానికి రాజేశ్వర రావు గారు సారథ్యం వహించారు. 1950లో మాస్కోను సందర్శించి, స్టాలిన్‌తో సమావేశం జరిపిన నలుగురిలో శ్రీ రాజేశ్వరరావు గారూ ఒకరు. విప్లవ సిద్ధాంతానికి ప్రత్యామ్నాయంగా ఆయన 1949లో ఒక సిద్ధాంత వ్యాసాన్ని వ్రాశారు. "ఆంధ్ర డాక్యుమెంటు"గా ఆ వ్యాసం ప్రసిద్ధి బొందింది. రాజేశ్వర రావు గారు తన పందొమ్మిదో ఏట 1943లో ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీకి కార్యదర్శిగా ఎన్నికయ్యారు. 1948లో కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సభ్యులయ్యారు. 1964లో అవిభక్త కమ్యూనిస్టు పార్టీ రెండుగా చీలి పోయిన తర్వాత "కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా"కు ప్రధాన కార్యదర్శి బాధ్యతలను స్వీకరించారు. 199C వరకూ అవిచ్ఛిన్నంగా ఆ పదవిలో కొనసాగి అనారోగ్య కారణాలవల్ల ఆ పదవికి రాజీనామా చేశారు.

రాజేశ్వర రావు గారు గొప్ప వక్త కాదు. కానీ రైతులకూ, వ్యవసాయ కూలీలకూ సోషలిస్టు లక్ష్యాలను స్థానిక పరిస్థితుల ఉదాహరణంగా చెప్పడములో రావు గారికి ప్రజ్ఞ అసమానము. ఆయన వేషము, నడవడిక, సంభాషణ తీరులలో రైతాంగ ముద్ర స్పష్టంగా కనిపించేది.

స్వార్థముతో, క్రూరత్వముతో కంపు కొట్టే ఈనాటి రాజకీయ వ్యవస్థలో రాజేశ్వరరావు గారి వంటి పవిత్ర చరిత్ర గల వ్యక్తులు చాలా అరుదు. ప్రజల మనిషిగా చరిత్రలో చిరకాలం నిలిచిపోయే ఈ చరితార్థజీవునికి మా శ్రద్ధాంజలి.

# శ్రీ వాసవీ జయంతి - మే 20

అంధకార బంధురమైన జగత్తులో అహింసా జ్యోతిని వెలిగించిన మహనీయ మూర్తి - పవిత్రకీర్తి శ్రీ వాసవీ దేవి ఈ తెలుగు గడ్డపై - పవిత్ర గోదావరీ తీరమున- కుసుమాంబ, కుసుమగుప్త దంపతులకు - ప్రథమ సత్యాగ్రహి గా జన్మించిన అత్యంత పవిత్ర దినము వైశాఖ శుద్ధ దశమి. ఆ పుణ్య దినము ఈ సంవత్సరము 20.5.1994వ తేదీ శుక్రవారం అవుతూ ఉంది.

ఆ పుణ్యదినాన 'అమ్మ' జన్మదినోత్స వాలను ఘనంగా జరిపించడము శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాల పరిపాలకులకు ప్రధాన కర్తవ్యము.

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ వారు నిర్ణయించిన శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి ఆరాధనా విధానములోనూ, ఆ తల్లికి సంబంధించిన సంకల్పము, నామావళితో ఈజయంతి కార్యక్రమాలను నిర్వహించ డము తప్పదని ఈ సందర్భంగా గుర్తించడం అవసరం.

ప్రతి వైశ్యుడు 20.5.1994వ తేదీన తమ ఇంటి ముంగలిని శుభ్ర పరచి - ముగ్గులతో అలంకరించి - ముఖ ద్వారానికి మామిడి ఆకుల తోరణాన్ని కట్టి - శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి సంకల్పముతో, శ్రీ వాసవీ సహస్ర నామావళితో అర్చనలు చేసి, నైవేద్య సమర్పణ జరపడము - ఆనాటి సాయంత్రం పునఃపూజ చేయడము కర్తవ్యంగా గుర్తుంచుకోవాలి.



మంత్రివర్యులు శ్రీ కె.రోశయ్య గారి నుండి 'సంఘోద్ధారక' బిరుదును స్వీకరిస్తున్న, ఆం.ప్ర. ఆర్యవైశ్య యువజన సంఘాల సమాఖ్య మాజీ అధ్యక్షులు, ఏజెంట్ రత్న శ్రీ కూరపాటి కృష్ణమూర్తి గారు 20.2.1994వ తేదీన హైద్రాబాద్ కాచిగూడ వైశ్య హాస్టల్లో జరిగిన సభలో, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య వారు ఈ బిరుదును శ్రీ కృష్ణమూర్తి గారికి ఇచ్చారు.

# సూక్తి ముక్తావళి

మహా భారత సంగ్రామం తప్ప లేదు. కురు క్షేత్ర సమరాంగణ భూమిలో ఇరు పక్షాలు సంగరానికి సన్నద్ధమై, ఎదురెదురుగా నిలబడ్డాయి. నారిని లాగి చూచి గాండీవాన్ని సరిచూచు కొన్నాడు అర్జునుడు. తల ఎత్తి ఎదురుగా చూచాడు. కనిపించారు తాత భీష్ముడూ, గురువులు ద్రోణ, కృపాచార్యులూ, మిత్రుడు అశ్వత్థామ, సోదరులు ధుర్యోధనాదులూ. పై వారిలో కొందరు అర్జునునికి పూజ్యులు. కొందరు దగ్గర బంధువులు. ఆయన మనస్సులో కలకలం బయలు దేరింది. ఆవేదన అంచులు దాటింది. దుఃఖము ముంచు కొచ్చింది. అక్షయ తూణీరాన్నీ, గాండీవాన్నీ రథముపై ఉంచాడు. విజయ సారథి కృష్ణునికి తనలోని యుద్ధ విముఖత్వాన్ని వెల్లడించాడు. ఆత్మీయులపై ధనస్సును సంధించలేను. పూజ్యులపై బాణాలను వదల లేను అని ఆయనతో గద్గధిక స్వరంతో విన్నవించాడు. సర్వజ్ఞుడు, జగన్నాటకసూత్రధారి అయిన వాసుదేవుడు విజయుని అమాయకత్వాన్ని తలంచి లోలోన నవ్వుకున్నాడు.

ఈ సమయములోనే శ్రీకృష్ణ భగవానుడు అర్జునునికి తత్వాన్ని బోధించింది. ఈ తత్త్వ బోధే తుదకు 'భగవద్గీత'గా ప్రసిద్ధి జెందింది. భగవంతుడు చెప్పిన గీత కాబట్టి భగవద్గీత. ఆ గీతా సారాన్ని పలువురు పలు రకాలుగా తమ రచనల్లో పద్యమూ, గేయమూ, వచనంగా వింగడించారు. ఆ అర్జునునికి ఆ భగవానుడు బోధించిన ఆ గీతా సారాన్ని 'కరుణశ్రీ' తన విజయశ్రీ కావ్యములో ఎంతో కమ్మగా, హృద్యంగా రసాత్మకంగా వివరించాడు.

"రక్తపు కూడు గాక మన రాజులకున్
ఘృత సూప యుక్తమౌ
భుక్తి లభించునే విడిచి పుత్తువె
ధర్మము కర్మ సూత్ర సం
సక్తము సృష్టి యెల్ల సహజమ్ములు
దప్ప ప్రు చావు పుట్టుకల్
ప్రాక్తన పుణ్య పాపములు ప్రాణులకున్
సుఖ దుఃఖ హేతువుల్"

– ఈ పద్యము అందులోనిదే. మన వంటి రాజులకు రక్తపు కూడు కాకుండా నెయ్యి, పిండి వంటలతో కూడిన భోజనము లభిస్తుందా? అట్లని ధర్మాన్ని వదలి పెట్టావా? ఈ యావత్తు సృష్టి అంతా కూడా 'కర్మ' అనే దారముతో కూర్చబడిందే. జననము, మరణము అనేవి సర్వ ప్రాణులకు సహజంగా వచ్చేవే. అయితే ప్రాణులు అవి తమ ముందు జన్మ అంటే గత జన్మలో చేసుకొన్న పుణ్యము లేక పాపములను బట్టి సుఖ దుఃఖాలను అనుభవిస్తాయి – అని ఈ పద్యానికి అర్థము. అంటే, ప్రాణులు గత జన్మలో పుణ్యము చేసుకుంటే ఈ జన్మలో సుఖ సంతోషాలతో జీవిస్తారు. గత జన్మలో పాపము చేసి ఉంటే ఈ జన్మలో దుఃఖాలను మాత్రమే చవి

చూస్తారు. ఈ సత్యాన్ని ప్రతి మానవుడూ తప్పక గమనించాలి. ఎందుకంటే ఆ ప్రాణి కోటిలో మానవుడూ ఒకరు కాబట్టి. జీవ కోటిలో, ఏ జీవికీ లేనట్టి మేధస్సు, బుద్ధి, ఆలోచనా శక్తీ మొదలగు ఉత్తమ లక్షణాలు మానవునికి ఉన్నాయి. అందు వల్ల ప్రతి మనిషీ తాను ఉదయం నిద్ర లేచినప్పటి నుండీ రాత్రి శయనించు వరకూ చేయు ప్రతి కర్మనూ, అందులోని పుణ్య పాపములు బేరీజు వేసుకొని చేయడము అవసరము. అట్లు బేరీజు వేసుకొనేందుకు అవసరమైన జ్ఞానశక్తిని భగవంతుడు ప్రత్యేకంగా మనిషికి ఇచ్చి నందువల్ల ఇది సాధ్యము కూడ. కాబట్టి మంచి పనిని అంటే మంచి కర్మను చేయుట ద్వారా పుణ్యాన్ని సముపార్జించు కోవాలి. ఆ పుణ్య సముపార్జన ఫలితంగా ఆతనికి రానున్న జన్మ ఉన్నతమైందిగా సుఖ సంతోషాల కుప్పగా ఉంటుంది.

ఈ పుణ్యము గురించి పోతరాజు గారు ఇలా చెప్తాడు తన భాగవతములో.

"చేసినఁగాని పాపములు చెందవు,
చేయ దలంచి నంతటం,
జేసెద నన్న మాత్రమున జెందు
గదా కలివేళ పుణ్యముల్
మోసము లేదటంచు నృపముఖ్యుడు
గాచె గలిన్ మరంద ము
ల్లాసము తోడ గ్రోలు విరులం దెగ
జూడని తేటికై వడిన్ "

కలిన్ అంటే ఈ కలియుగములో చేస్తేనే పాపము వస్తుంది. అయితే పుణ్యా ముందే అది నేను పుణ్యము చేయాలి? అని మనిషి మనస్సులో అనుకున్నా, పుణ్యమును చేయుటకు ప్రయత్నించినా అంత మాత్రాన్నే పుణ్యము లభిస్తుంది. గడచిన కృతయుగమూ, త్రేతా యుగమూ, ద్వాపర యుగాల లోని మానవులు ఎవ్వరికీ లేని గొప్ప అవకాశం ఈ కలియుగము లోని మన మానవులకు లభించింది. విజ్ఞుడైన మానవుడు ఈ అవకాశాన్ని వినియోగించుకొని, తమకు రానున్న జన్మ సుఖమైనదిగా, సంతోష భాజన మైనదిగా ఉండేందుకు ప్రయత్నించాలి.

పుణ్యము అంటే మంచి పని అనీ, మంచి పని చేయుట వలన కలిగే ఫలము అనీ అర్థము. అందుకే నిఘంటు కారులు పుణ్యము అనే పదానికి సుకృతము అనే అర్థాన్ని కూడ చెప్పారు.

" అంత కడివెడు పాలపై ఒ
క్కింత మీగడ పేరి నట్లుగ
మనకు మిగులును
గతము లోపలి మంచి ఒక్కటే "

– అని అంటారు డాక్టర్ సి. నారాయణ రెడ్డి గారు ఒక గేయములో.

పాల కడవ పెద్దదే కావచ్చు. కానీ ఆ పాలపై కట్టే మిగడ ఒక్కింత మాత్రమే. ఇది మనందరికీ తెలిసిన విషయమే. ఆ మీగడ ఎంతో రుచిగా ఉంటుంది. దాని నుండే నెయ్యి వస్తుంది. అట్లే మనము చేసే కర్మల ఫలము పాలపైన మీగడవలె రానున్న జన్మకు మిగుల్తుంది.

( సంపాదకుల ఆకాశవాణి ప్రసంగాల నుండి)

# ఆల్ ఇండియా వైశ్య ఫెడరేషన్ (న్యూ ఢిల్లీ)
# షట్సూత్ర ప్రణాళిక

(ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములోని చరిత్రాత్మక, విప్లవాత్మక పట్టణమగ మీరట్‌నందు 1993 మే నెల 8, 9 తేదీలలో ఆల్ ఇండియా వైశ్య ఫెడరేషన్ వారు నిర్వహించిన 'వైశ్య ఐక్యతా శతాబ్ది' ఉత్సవముల సందర్భమున ఫెడరేషన్ సర్వ సభ్య సమావేశములో ఏకగ్రీవముగ తీర్మానించబడిన షట్సూత్ర ప్రణాళిక)

## మొదటి సూత్రం

భారతదేశము లోని వైశ్యులంతా రాజకీయముగ, సామాజికముగ, ఆర్థికముగ అభివృద్ధి చెందాలంటే ఐక్యత కావాలి. సముచితముగ ఐక్యమైతే దేశము కూడ అభివృద్ధి చెందును.

## రెండవ సూత్రం

వైశ్య సమాజము నేడు రాజకీయ రంగముతోపాటు, వ్యవసాయరంగము, వ్యాపార రంగములలో కూడ తగిన గౌరవము పొందుట లేదు.

దేశ జనాభాలో దాదాపు పదిశాతమున్న వైశ్య జాతికి గ్రామ పంచాయతీలలోనూ, ప్రజా మండళ్లలోనూ, జిల్లా పరిషత్తుల్లోనూ, మునిసిపాలిటీల్లోనూ, కార్పొరేషన్లలోనూ, శాసన సభ, శాసన మండళ్లలోనూ, లోకసభ, రాజ్యసభల్లోనూ, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల్లోనూ సముచితముగ ఎన్నికగుటకు తోడ్పడవలసినదిగా అన్ని రాజకీయ పార్టీల వారిని కోరుట.

## మూడవ సూత్రం

కేంద్ర ప్రభుత్వం సమాజవాద తరహా సిద్ధాంతమును ఆచరించుచున్నందున వైశ్యులు రాజకీయముగ, వాణిజ్యముగ, వ్యావసాయకముగ, ఉద్యోగ రంగముల్లోనూ వెనుకబడి యున్నారు. ఇందువలన దేశ ఆర్థిక పరిస్థితికి కూడ దెబ్బ తగిలినది. కేంద్ర ప్రభుత్వం దేశ ఆర్థిక బడ్జెటును తయారు చేయునప్పుడు వైశ్య ప్రతినిధులను తప్పక సంప్రదించమని కోరుట.

## నాల్గవ సూత్రం

1. వైశ్యుల సంస్థలన్నీ ఫెడరేషన్‌తో అనుబంధము చేయుట.
2. ఫెడరేషన్ కేంద్ర కార్యాలయమునకు ఢిల్లీలో 'వైశ్య భవన్' నిర్మించుట.
3. ఉద్యోగాల్లోనూ, వ్యవసాయములోనూ బీద వైశ్యులకు సహాయము చేయుట.
4. కొద్ది కొద్ది వైశ్య ఉద్యోగస్థులకు, కొద్దికొద్ది వైశ్య వ్యవసాయదారులకు ఋణసౌకర్యము కలుగజేయుటకు

ప్రత్యేకముగ ఒక 'వైశ్య బ్యాంక్'ను యేర్పాటు చేయుట.

5. వైశ్యులు శుభ, అశుభ కార్యక్రమములలో, ఖర్చులు తగ్గించుకొని ఆర్థిక పురోభివృద్ధికి తోడ్పడుట.

ఐదవ సూత్రం

వైశ్యులలోని అన్ని వర్గముల సహపంక్తి భోజనాలు యేర్పాటు చేయుట మొదలైన కార్యక్రమములతో వైశ్య సమాజమును బాగుపరచుట.

ఆరవ సూత్రం

1. 'వైశ్య ఐక్యతా శతాబ్ది' ఉత్సవముల గురించి దేశములోని ప్రతి వైశ్యునికి వివరించుట.
2. వైశ్యుల యిబ్బందులను ఫెడరేషన్ వారు గుర్తించి, సహకరించుట.
3. వైశ్యుడు ఏ రాజకీయ పార్టీలోనైనా, చక్కగ పనిచేయు చున్నప్పుడు, అతనిని గుర్తించి, ఏ ఎన్నికలలోనైనను, గెలుచునట్లు తోడ్పడవలెను.
   ఒకే స్థానములో యిద్దరు వైశ్యులను పోటీపెట్టకుండా చూచుట, రాజకీయ విచక్షణ లేకుండా ఎన్నికల్లో పోటీ చేయు వైశ్యుని గెలుపించుటకు తోడ్పడుట.
4. వైశ్య ఉద్యోగస్థులకు, వైశ్య వ్యవసాయదారులకు, 'రోజ్‌గార్' ఋణములు అందునట్లు కృషిచేయుట.
5. శుభ, అశుభ, కార్యక్రమముల్లో ఖర్చు తగ్గించుకొని 'వైశ్య శతాబ్ది' ఉత్సవాలు ఘనముగా దేశమంతా చేయించుట.
6. ఈ సంవత్సరమంతా (1994 మే నెల వరకు) 'శతాబ్ది' ఉత్సవములు ప్రతి గ్రామములోనూ ప్రతిపట్టణములోను విజయవంతం చేయుట.

చుండూరి అప్పారావు
తేది : 2.1.94 రావెల.
గుంటూరు జిల్లా

## పాడరాళ్ళలో శ్రీ కోదండ రామస్వామి వారి ప్రతిష్ఠ

అనంతపురం జిల్లా బుక్కరాయ సముద్రం మండలములోని పాడరాళ్ళ గ్రామములో 18.4.1994వ తేదీన శ్రీ కోదండరామస్వామి గారి ప్రతిష్ఠ జరుగుతుంది. ఈ కార్యక్రమములో స్వామి శ్రీ సర్వేశ్వరానంద, అనంతపురం నియోజకవర్గ శాసనసభ్యులు శ్రీ బి.నారాయణ రెడ్డి, ఆం.ప్ర. ఆర్యవైశ్య యువజన సంఘాల సమాఖ్య మాజీ అధ్యక్షులు శ్రీ జూటూరు వేమయ్య, అనంతపురం మునిసిపల్ కమీషనరు శ్రీ సి. శివశంకర్, ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ కె.రాధాకృష్ణయ్య, ఎక్సయిజు డిప్యూటీ కమీషనర్ శ్రీ సి. మారెప్ప గారలు పాల్గొంటారు. అనంతపురం పురప్రముఖులు శ్రీ మేడా రామయ్య శ్రేష్ఠి, శ్రీ మేడా సుబ్బయ్య శ్రేష్ఠిమరియు పాడరాళ్ళ గ్రామ ప్రజలూ ఈ కార్యక్రమానికి ఆహ్వానించు వారిలో ఉన్నారు.

# బాల మేధావుల మాతృదేశ సందర్శనం



అంబటి జయకృష్ణ



అంబటి బాలమురళీకృష్ణ

పదహారేండ్ల వయస్సుననే వైద్య విద్యలో డాక్టరేట్ డిగ్రీని తీసికొని 17వ ఏట డాక్టరుగా గుర్తింపు పొందనున్న అంబటి మురళీకృష్ణ, పంతొమ్మిదేళ్ళ వయస్సులో తమ్మునితో కలిసి 'ఎయిడ్స్' వ్యాధిపై పరిశోధనాత్మక గ్రంథాన్ని వ్రాసి ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు పొందిన అంబటి జయకృష్ణ భారత ప్రధాని ఆహ్వానంపై భారత దేశానికి వచ్చారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఈ బాల మేధావులు ఇరువురు 8, 9 తేదీలలో తిరుపతి పట్టణాన్ని కూడా సందర్శించారు. వీరిలో మురళీకృష్ణ ప్రపంచములో డాక్టరేట్ పొందిన వారిలో అతి చిన్న వయస్కుడు. 'ఎయిడ్స్' వ్యాధి నిర్ధారణ కోసం నిర్వహించే రక్త పరీక్షలకు ఇప్పుడవుతున్న వ్యయం చాలా ఎక్కువ. ఈ వ్యయాన్ని 80 నుంచి 90 శాతం వరకు తగ్గించే క్రొత్త టెక్నాలజీని ఈ బాల మేధావులు కనిపెట్టారు. వైద్య, గణిత రంగాలను మిళితంచేసి సరిక్రొత్త విషయాలను ఎన్నింటినో పరిశోధించి బహుముఖ ప్రశంసలందుకున్న ఈ సోదరులు 'నోబెల్ బహుమతి' కోసం ఎదురు చూస్తున్నారు. వీరిద్దరికీ మ్యాథమాటిక్స్ అంటే ఎక్కువ ఇష్టం.

తమ్ముడు బాలమురళి డిగ్రీలో బయోలజీ చదవగా జయకృష్ణ ఎలక్ట్రానిక్స్ ఇంజినీరింగ్‌లో బ్యాచులర్ డిగ్రీ చేసి మెడిసిన్ చదివి యం.డి.,పి.హెచ్.డి., కూడా చేశారు. వైద్య శాస్త్రాన్ని ఔపోసన పట్టాలన్నది వీరి లక్ష్యం. అమెరికా శాసనాల ప్రకారం మెడిసిన్‌లో డిగ్రీ పొందాలంటే 21 సం॥లు పూర్తి కావాలి. అయితే బాలమురళీకృష్ణకు 16 సం॥రాలే. అందువల్ల తాను మెడికల్ లైసెన్సు పొందుటకు వయస్సు మినహాయింపుకై ప్రయత్నిస్తున్నాడు. వీరు 'రాయలసీమ వాసులు కావడం' రాయలసీమకే గర్వకారణం. వీరి పితామహులు అంబటి సుబ్బరాయ గుప్త గారు కడప జిల్లా పులివెందుల వాస్తవ్యులు. తర్వాత కుమారులు మద్రాసు పట్టణానికి వెళ్ళగా వారి వెంట వీరు వెళ్ళారు. వీరు మంచి అవధానులు. మంచి విమర్శకులు. వీరి పేర ఒక చారిటబుల్ ట్రస్టును ఏర్పాటు చేసి దాని ద్వారా 'ఎయిడ్స్' ప్రమాదాన్ని గురించి ప్రజలకు వివరించాలన్నదే వీరి ప్రధాన ధ్యేయం. తిరుపతిలో వున్న రెండు రోజులు కూడా 'ఎయిడ్స్' వ్యాధిపైన్నే ఉపన్యాసాలిచ్చారు. 'ఎయిడ్స్' రాకుండా జాగ్రత్తపడమన్నది వీరిచ్చే సందేశము.

వైశ్యప్రబోధిని, ఏప్రిల్, 1994

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

నాయకుడిగారి ఇంటికి వెళ్ళాము. మేడమీద వరండాలో జనం గుంపులు గుంపులుగా వున్నారు. ఇదంతా రానున్న స్థానిక సంస్థల ఎన్నికల హడావుడి. మాతో ప్రత్యేకంగా మాట్లాడేందుకు నాయకుడిని ఒప్పించాము. అందరిని బయటికి పంపారు. గదిలో ముగ్గురం మాత్రమే వున్నాం. అప్పుడు బాపయ్య మాట్లాడ కూడదు. నే నొక్కడినే మాట్లాడాను.

నాయకుడుగారు తమ నేరాన్ని ఒప్పు కోలా. మాకు తెలిసిన విషయాలన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పగానే ఆయన నిర్ఘాంతపోయాడు. కొంచెం సేపు ఆలోచనలో పడ్డారు. తలయెత్తిచూచి నవ్వారు. "ఆ పిల్లనిచ్చి బాపయ్యకు వివాహం చేయించుతా"నన్నారు. అయితే "రెండు మాసాల తరువాత ఎప్పుడైనా సరే చేయిస్తా"నన్నారు. "కాదు, వెంటనే చెయ్యా" అన్నాను. "పరిస్థితులు అను కూలంగాలే" వన్నారు. "ఎన్నికలేనా కారణ" మన్నాను. "అవు"నని నవ్వారు. చేతిలో చెయ్యి వేయించుకొని వచ్చాము.

ఆయన తు–చ తప్పకుండా చేశారు. కాని కష్టాలు తప్పలేదు. నీరూరినట్లు కష్టాలు వస్తూనే వున్నాయి. బెజవాడలో కమ్మ విద్యార్థి హాస్టలులో వివాహానికి ఏర్పాట్లు చేశాము. బెజవాడ వర్తకులైన శ్రీ ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారు అన్ని ఏర్పాట్లు చేయించారు. ఆంధ్రదేశ మంతటా కమ్మవారిలో ప్రచారం జరిగింది. వధువు తరపువారు శ్రీ లక్ష్మీనారాయణ గారి ఇంటిలో దిగారు. వరుని వైపువారు మా యింటిలో. రెండిండ్లలోని స్త్రీలు పురుషులం కలసి బంధుమిత్రులను వివాహానికి ఆహ్వానించాము. సంస్కార ణాభిలాషు లెందరో ఆంధ్రదేశ మంతటి నుండి వచ్చి మా యింట్లో దిగారు. పాలపర్తివారు, పాలికచర్లవారు, మంత్రవాది వారు, జవ్వాజివారు, మలతెకవారు, యామినీవారు షుమారు 50 మంది వచ్చారు. బాపయ్య తల్లి, అక్క, అన్నగారు కూడా మా యింట్లోనే దిగారు.

వీరందరూ రావడం నాకెంతో ఆనందంగా వుంది. అయితే అది కొన్ని నిముషాలుమాత్రమే. బాపయ్యతల్లిగారు నా వద్దకువచ్చి "నేనెందుకు వచ్చానో తెలుసా? పెళ్ళి చేయించడానికి కాదు; చెడగొట్టడానికే వచ్చాను. నా కొడుకుని నాశనం చెయ్యడానికి పూనుకున్నావా చంచయ్యగారూ?" అని ఉగ్రురాలై కేకలు వేసింది. నా కేమి తోచలా. తమాషాచేసి చూద్దామని "అమ్మా! నే నలా చేస్తానా? ఈ పెళ్ళికి కారకుడు ఈ బ్రాహ్మడే" నని నా మిత్రుడు శ్రీ మంత్రవాది వెంకటరత్నంగారి వైపు కన్ను కొట్టాను. "బ్రాహ్మణ మంత్రాంగమా!" అన్నది.

ఆయన మీదికి దూకింది; జుట్టు లంకించుకొని చెయ్యెత్తింది, కొట్టింది కూడాను. భారీమనిషి, బలశాలి. మేమందరం ఆమెను లాగేసి, ఒక గదిలోవేసి తాళంవేశాము.

బాపయ్య గారిని సలహా అడిగాము. తనతల్లి పెండ్లికి రావలసిందేనని ఖండితంగా చెప్పాడు. అప్పుడు అంటే పెండ్లికి ముందు రోజున వచ్చిన కమ్మ నాయకులను కలుసుకొని, ఆమె మనసు మార్చమని చెప్పాము. ముఖ్యంగా బ్రాహ్మణ కోడూరు వారిని పంపాము. కొంత వరకు శాంతించింది. మరునాడు పెండ్లివేళకు ఆమెను విడిచిపెట్టాము.

పెండ్లికి అయిదారు వేలమంది కమ్మ వారు వచ్చారు. స్థానిక పెద్దలెందరో వచ్చారు. దూర పట్టణాలనుండి కూడా వచ్చారు. సహపంక్తి భోజనాలు చేశారు. వితంతు వివాహాలు చేసుకోవచ్చుననీ, సంఘ ఆక్షేపణలేదనీ కమ్మవారొక్క వివాహంతోనే తీర్మానించారు. శ్రీ ఆడుసు మల్లి వారు ఒక ప్రకటన చేశారు. ఇక జరుగబోయే ప్రతి వివాహానికి రు. 250ల చొప్పున మొదటి డజను పెండిండ్లకు బహూకరిస్తామని ఆ సభలో అందరి: ఉత్సాహం కలిగేలా మాట్లాడారు.

శ్రీ అడుసుమల్లి వారితో కలిసి, శ్రీ జాగర్లమూడివారుకూడ నడుం బిగించి వడ్డించడం ప్రారంభించారు. ఏమి ఎత్తు వేస్తున్నారోనని మేము సంశయించి, ఇద్దరిని అందరిలో కలిసి భోంచెయ్యమని బ్రతిమ లాడాము. రెండవపంక్తిలో కూర్చుంటా మన్నారు. ఈ లోగా శ్రీ జాగర్లమూడి వారు మాయమైపోయారు.

బాపయ్య తల్లిగారు చాలా సంతో షించారు. వెళ్ళేటప్పుడు నాకు నమ స్కారం చేసి నవ్వింది. కృతజ్ఞతా పూర్వకంగా చూస్తూ వెళ్ళింది. ఆ చూపు ఇప్పటికీ నాకు జ్ఞాపకమే.

తరువాత కమ్మ సంఘంలో వివాహాలు వెంట వెంటనే జరిగాయి. వీరేశలింగం గారు నాటిన విత్తనం యాభై ఏండ్లకు పెద్ద వృక్షమై ఆంధ్రదేశంలో అనాధ స్త్రీలకు ఆశ్రయమిచ్చింది. ఇదంతా చూడ కుండానే మిత్రుడు శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్యగారు చనిపోయినందుకు విచారపడ్డాను.

ఇక్కడ మరో విషయం చెప్పాలి. కమ్మవారిలో మొదటి వితంతూద్వాహం అంతకుముందే జరిగింది. ఆ వివాహం చేసుకున్నది నా మిత్రులు డాక్టరు మూల్పూరి రంగయ్యగారు, వారి సతీమణి చుక్కమ్మగారు. ఇది రహస్యంగానే జరిగింది. ప్రజామోదంతో, కమ్మసంఘం సమ్మతితో జరిగిన ప్రథమ వివాహం బాపయ్యగారిదే.

బాపయ్యగారు నన్ను కలుసుకున్న ప్పుడు "మామగారూ" అనీ, ఆయన బిడ్డలు "తాతగారూ"అనీ పిలుస్తుంటే నా కెంతో ఆనందంగా వుండేది.

## విశ్వబ్రాహ్మణులలో వితంతు వివాహం

వైశ్యులలో,కమ్మవారిలో, బ్రాహ్మణుల లోను వితంతు వివాహాలు సర్వసామాన్య మైనాయి. కాబట్టి ఇతిమ్మా కులాలలో

తమంతట తామే చేయించుకుంటారని నమ్మాను. కాని అలా జరుగుటలేదు. ఏ కులానికి ఆ కులం కట్టుబాట్లూ, నాయకులూ వేరు. హిందూసంఘం ఎంత హీన స్థితికి వచ్చిందో చూడాలంటే విశ్వబ్రాహ్మణుల్లో సంస్కరణలు చేయించి చూడాలి. ఈ సంఘంలోని అధోగతి ముందుగా తెలిసివుంటే వారిలో వితంతు వివాహము చేయించటానికి సాహసించియుండను. తెలియక ప్రారంభించి విపరీతమైన కష్ట పరంపరలను ఎదుర్కోవలిసి వచ్చింది. పూర్తి అయ్యేలోగా తలప్రాణం తోక కొచ్చింది.

ఈ ఉద్యమం అప్రయత్నంగానే ప్రారంభమైనది. గుంటూరులో రెండవ వితంతూద్వాహ సమయంలో శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారు ఉపన్యసించారు. ఆమెవెంట అందమైన బట్టలతో, ఒంటినిండా నగలతో, అలంకరించుకొన్న 10 సంవత్సరముల బాలిక వున్నది. ఆ బిడ్డను చూపించి "వితంతు"వని చెప్పారు. సభికులందరు విచారపడినారు.

ఆ బిడ్డ విశ్వబ్రాహ్మణులు–పెడన వాస్తవ్యులు శ్రీ కొండిపర్తి చంద్రకాంతము గారి తనయ. ఆయన బట్టలవర్తకుడు; ధనికుడు. ఆబిడ్డ ఒక్కతే ఆయనకు సంతానం. కొంతకాలానికి పిల్ల తండ్రిని రప్పించి మాట్లాడాను. పునర్వివాహానికి సమ్మతించారు. తనదగ్గరి బంధువర్గంలోనే వరుడు లభిస్తాడనీ, తానే నిర్ణయించగలననీ చెప్పారు. ఎంత ధనాన్నైనా ఖర్చుచేయుటకు సిద్ధమైనారు. కాని, ఈ వివాహాలకు డబ్బెందుకు? కులంలో కలసివచ్చే సంస్కార ప్రియులు కావాలి. రజస్వల కాకముందే పునర్వివాహం చేయించమని కోరారు. నా కిష్టం లేకపోయినా, ఆ సంఘ పరిస్థితుల్లో అదికూడ గొప్ప కార్యం గానే తోచింది. ఇతర సంఘాల్లోకూడ "రెడ్డొచ్చె మొదలెట్టు" మన్నట్టుగా వుంది. మొట్టమొదట రజస్వలకాని వితంతువుకే పెళ్ళి చెయ్యాలనేవారు. తరువాత రజస్వల అయినా భర్తతో కాపురం చెయ్యకూడదు; మూడోమెట్టు భర్తతో కాపురం చేసినా, బిడ్డను కని వుండ కూడదు; ఆఖరున బిడ్డలుగల వితంతువైనా సరేనన్నారు. విశ్వబ్రాహ్మణులలోను అలాగే మొదటి మెట్టుతో ప్రారంభమైంది.

అయితే, విశ్వబ్రాహ్మణ సంఘంతో నాకు పరిచయం లేదు. వారిలో నాకు స్నేహితులా లేరు. కాబట్టి, ఆసంఘంలో పనిచేయుటకు నాకు శక్తి చాలదని కొంత కాలం వూరుకున్నాను. కాని, పిల్లతండ్రి త్వరపడు తున్నందున కార్యభారం వహించాల్సి వచ్చింది.

ఈ పరిస్థితుల్లో విశ్వబ్రాహ్మణ సంఘంలో ప్రసిద్ధి కెక్కిన శ్రీ గానాల రామమూర్తిగారినీ, శ్రీ పెదప్రోలు సూర్యనారాయణరావుగారిని [1928–30 సం॥ మధ్య] కలుసుకొన్నాను. వారు సహాయం చేస్తామన్నారు. ఒక ప్లాను వేసు కున్నాము.

మా ఉద్యమానికి అనుకూలురను, ప్రతికూలురను వేరు చెయ్యాలి. కరపత్రాలద్వారా ఆ సంఘాన్ని రెండు ముక్కలు చేశాము. "ఆంధ్రరాష్ట్ర విశ్వబ్రాహ్మణ సంఘ సంస్కరణ మహాసభను" మా యింట్లో పెట్టి అనుకూలురను సమావేశపరిచాము. అయితే, అధ్యక్షులుగా ఉండటానికి వారిలో ఒక్కరూ అంగీక

రించారైరి. ధైర్యసాహసాలుగల శ్రీ సూర్యనారాయణరావుగారు దూరంగా వుండి మాత్రమే సహాయం చెయ్యదలచారు. కాబట్టి శ్రీ మోతే నారాయణరావుగారు అధ్యక్షుడుగాను, నేను కార్యదర్శిగాను నాటకం నడిపాము.

మహాసభకు షుమారు 50 మంది వచ్చారు. వారిలో గొప్ప పండితులు, శాస్త్రజ్ఞులు, వేదాలు శాస్త్రాలు బాగా వల్లించగలవారూ వచ్చారు. వైదిక బ్రాహ్మణ సభలా ఉంది; ఏది చర్చించబోయినా సంగతి సందర్భం లేకుండా శాస్త్ర చర్చగా మార్చేవారు. వితంతూద్వాహాలు శాస్త్ర సమ్మోదమేదని తమ పాండిత్యాన్ని వెల్లడించుటకు ప్రయత్నించారు. చివరకు నిర్వాహక సంఘాన్ని ఏర్పాటు చెయ్యాల్సి వచ్చింది. ఎవరూ ఉండనంటారే! కొందరిని ఒప్పించగానే హాజరైన యాభై మందీకూడాదాంట్లో ఉండాలన్నారు. వైదికులను, వైశ్యులను సంస్కరించటమే సులభమనిపించింది.

కొంతకాలానికి పెడనలో పిల్లతండ్రిగారి యింటిలోనే వివాహానికి ఏర్పాటు చేశాము. బెజవాడ నుంచి నేను, నా భార్య అన్నపూర్ణమ్మ, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, శ్రీ డాక్టరు గోవింద రాజులుగారు వివాహానికి బయల్దేరి వెళ్ళాము. సాయంత్రం 7 గంటలకు పెడనస్టేషనులో దిగాము. మమ్ము ఆహ్వానించడానికి ఎవరూ రాలేదు. స్టేషను మాష్టరును అడిగితే వివాహం సంగతే తనకు తెలియదన్నాడు. సామాను మోయుటకు కూలీలైనా లేరు. శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు సామాను మొయ్యలేరు. అన్నపూర్ణమ్మగారి చంకలో చంటిబిడ్డ వుంది. మా అందరి సామాను డాక్టరుగారు నెత్తిన, భుజాలమీద వేసుకొన్నారు. వారి ఉత్సాహం చూచి నాకు సిగ్గేసి, నేనూ కొంత సామానెత్తుకున్నాను. ఊళ్ళోకి వెళ్ళుతుండగా దారిలో ఒక ఒంటెద్దు బండి, లాంతరులతో వధువు తండ్రి ఎదురయ్యారు.

తన ముగ్గురు అన్నగార్లలో ఒకరు పెళ్ళికి సమ్మతించలేదట; సమిష్టికుటుంబం కావడంవల్ల ఎదిరించలేక-ఎన్నిలక్షల ఆస్థి వుంటే నేం?-వివాహం మానేశామన్నాడు. ఆయన, ఆయన భార్య వివాహం చేయించడానికి సిద్ధమేనట. అయితే బంధువులు కలిసి రానందున నిరుత్సాహపడ్డారట. మేము భోంచేసి పడుకొనేముందు "కాళేశ్వరరావు పంతులుగారూ! ఏదైనా ఎత్తువేసిచూడండి!" అని చెప్పారు. రాత్రి రెండు గంటలప్పుడు బాజాలు వినబడ్డాయి నిద్రనుండి లేచాను. పంతులుగారు సమర్థులని నాకు తెలుసు. అన్నదమ్ములందరిని పంతులుగారు ఒప్పించారు. పెళ్ళి జరుగుతుంది. బంధుమిత్రులను పిలుచుకొని రావటానికి కార్లు, లారీలు వగైరా చోట్లకు వెళ్ళాయన్నారు. 2-3 వందలమంది విశ్వబ్రాహ్మణులు వచ్చారు. ముందుగానే ఏర్పాట్లు సవ్యంగా జరిగివుంటే 5-6 వందల మంది వచ్చివుండే వారట, తెల్లవారు ఝామున 4 గంటలకు వివాహం జరుగుతూండగానే మరో వివాహానికి వధూవరుల ఏర్పాటు జరిగిందనే శుభవార్తను ప్రకటించారు. సంతోషంగా తెల్లవారింది.

( ఇంకా ఉంది)

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "
టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114,
పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును..

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30x10 రూము రూ.30,000/–, 15x7 రూముకు రూ.20,000/– అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి: 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30x15 రూమ్ నిర్మించబడుతుంది. 10x25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల</u> : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డోనేషన్లు స్వీకరించబడును.

I & II ఫ్లోరు రూము డోనార్సు : 10 రూములకు పరిమితము. ఒక లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు సంవత్సరంలో 30 రోజులు రూము యివ్వబడును. వారి ఫోటో శిలా ఫలక రూములో వేయబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్షరూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును. 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో శిలా ఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్‌లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్‌లపై పంపగోర్తాము. త్వరలో తిరుమలలో ఆఫీసు ఓపెన్ చేస్తాము. అంతవరకు పై అడ్రసుకు పంపకోర్తాము.

4. <u>వాసవీ నిలయం, పెనుగొండ</u> : పరిశీలనలో ఉంది.

5. <u>వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి</u>

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ

పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వేయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపర్రాయి పైన అదే సత్రములో వేయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వేయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.


–: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :–

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.


**N.B :-** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్య ప్రబోధిని - క్యాలెండరు

( 1994 ఏప్రెల్ 21 నుండీ 1994 మే 20 వరకు )

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 24 | మే 1 | 8 | 15 |
| సోమవారము | | 25 | 2 | 9 | 16 |
| మంగళవారము | | 26 | 3 | 10 | 17 |
| బుధవారము | | 27 | 4 | 11 | 18 |
| గురువారము | 21 | 28 | 5 | 12 | 19 |
| శుక్రవారము | 22 | 29 | 6 | 13 | 20 |
| శనివారము | 23 | 30 | 7 | 14 | |

ఏప్రెల్ 24 :- మహావీరజయంతి.

ఏప్రెల్ 25 :- చైత్ర పూర్ణిమ - హనుమజ్జయంతి.

ఏప్రెల్ 27 :- భరణీకార్తె ప్రారంభం.

ఏప్రెల్ 30 :– ఆదాయపుపన్ను చట్టముక్రింద డివిడెండ్లనుండీ వచ్చు ఆదాయములపై పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు రిటర్ను 26వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

మే 1 :– ప్రపంచ కార్మిక దినము – దుకాణాలు – సంస్థలు, కర్మాగారాలు–సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

మే 4 :– వాస్తు కర్తరి ప్రారంభము.

మే 11 :– కృత్తిక కార్తె ప్రారంభం.

మే 15 :– చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు ఆ చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

మే 16 :– శంకర జయంతి.

మే 20 :– శ్రీ వాసవీ జయంతి.

మే 20 :– A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

***24, 1, 8, 15 ఆదివారాలు***

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

Grams : TOUR Call 9.00 a.m. to 7.00 p.m. ✆ : 5068



# ఆల్ ఇండియా టూరిస్టు కంపెని,

**11–228, షావుకార్ స్ట్రీట్,**
**పామిడి – 515 775.**
అనంతపురం జిల్లా (ఆంధ్రప్రదేశ్)

## సంపూర్ణ ఉత్తర దేశ కాశీ యాత్ర రైలు ప్రయాణము

23.4.93 గుంతకల్ నుండి 28 రోజులు, రెండు పూటల భోజనము, కాఫి, టిపిన్, సైట్ సియింగ్ ఖర్చులతో సహా.
స్లీపర్ క్లాస్ కుషన్ బర్తు సౌకర్యముతో టికెట్టు 1 కి రూ.5651–00

పై యాత్ర యందు చూపబడు క్షేత్రములు :–
పూరి, కోణార్క్, హౌరా, గయా, కాశి, నేపాల్, త్రివేణి సంగము, అయోధ్య, హరిద్వార్, ఋషికేష్, బదరీనాథ్, న్యూ ఢిల్లీ, మధుర, ఆగ్రా, జైపూర్, బొంబాయి, పండరీపురం.

16.5.94 గుంతకల్ నుండి రెండవ పారి రైలు ప్రయాణము 48 రోజులు స్లీపర్ క్లాస్, కుషన్ బర్తు సౌకర్యముతో టికెట్టు 1కి రూ.9651–00 రెండు పూటలు భోజనము, కాఫి, టిపిన్, సైట్ సియింగ్ ఖర్చులతో సహా.

పై తెలిపిన 28 రోజులలో యాత్రలుగాక యిందు క్రింద తెలిపిన యాత్రలు అధికముగా చూపబడును. గంగాసాగర్, గంగోత్రి, కేదార్ నాధ్, డెహరాడున్, అమృత్‌సర్, జ్వాలాముఖి, జమ్ము, వైష్ణవిదేవి, మౌంటుఅబు, పంచ ద్వారకలు, సుధామాపూరి, సోమనాధ్, షిర్డి, త్రయంబకేశ్వర్, నాసిక్, వగైరా క్షేత్రములతో సహా.

## ఈ యాత్రలో కంపెనీ తమకు చేయు సౌకర్యములు :

ఉదయం కాఫి, ఫుల్ టిపిన్, రెండు పూటల బ్రాహ్మణ రుచికరమైన భోజనము, బండిలో చాకలి, డాక్టర్, తపాలా, బ్యాంకింగ్ సదుపాయం కలవు. యాత్రికుల వెంట భాషలు తెలిసిన ముగ్గురు గైడ్స్ ఉందురు. సామాన్లు బండి యందు ఉంచి దర్శనార్థము వెళ్ళిరావచ్చును. సామానుల భద్రత ఏర్పాటు ఉంది. మీ సేవ నిమిత్తం 12 మంది స్టాఫ్ ఉందురు. అన్ని సదుపాయములు గలవు. కావున రు.1500.00 బ్యాంక్ "D.D" పై అడ్రస్సుకు పంపి మీ బర్తు నంబరు ఖాయపరచుకొనేది. పూర్తి వివరములకు కవరు వ్రాయండి. ప్రత్యుత్తరము పొందండి.

***D.C.* రామారావు, ఆర్గనైజర్**

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

ఈ వార్త తెలిసిన వానరులంతా అట్ట హాసంతో కుంభకర్ణుణ్ణి ఎదిరించారు. చెట్లు, కొండలు పెళ్లగించి, పళ్లు పట పటా కొరుకుతూ కుంభకర్ణుడి మీదకు విసిరి వేశాడు.

హనుమంతుడు వెళ్లి కుంభ కర్ణుడి వీపు మీద ఒక్క గుద్దు గుద్దాడు. దాంతో కుంభకర్ణుడు కళ్లు తిరిగి పడిపోయాడు. కాసేపటికి తేరుకొని హనుమంతుణ్ణి కొట్టాడు. ఈ మాటు హనుమంతుడు కళ్లు తిరిగి పడిపోయాడు.

కుంభ కర్ణుడు నలుడిని, నీలుడిని కూడా నేలకేసి కొట్టాడు. మిగతా వానర వీరులను కూడా కొట్టి తరిమాడు. వాన రులంతా భయంతో పరుగెత్తిపోయారు. సుగ్రీవుడు, అంగదుడు మొదలగు వీరులంతా కుంభకర్ణుడి దెబ్బకు అదిరి పోయారు.

కొద్దిసేపట్లో హనుమంతుడికి స్పృహ వచ్చింది. సుగ్రీవుణ్ణి వెదకసాగాడు. సుగ్రీవుడు కూడా మేలుకొన్నాడు. మళ్లీ వానర మూకలన్నీ విజృంభించాయి. కుంభ కర్ణుడు వికృతాకారుడై వానరులను గుంపులు గుంపులుగా నమిలిపారేస్తున్నాడు. కొంత మందిని నలిపి పారేస్తున్నాడు. ఇంతలో రాక్షస సేనలు కూడా యుద్ధంలో ప్రవేశించాయి. వానర సేనలన్నీ అల్ల కల్లోల మయిపోయాయి. చూశాడు శ్రీరామచంద్రుడు. సుగ్రీవుణ్ణి, విభీషణుణ్ణి, లక్ష్మణుణ్ణి దగ్గరకు పిల్చాడు. "మీరంతా సైన్యాలను చక్కదిద్దండి. నేను ఈ దుష్టుడి సంగతి చూస్తాను" అన్నాడు.

శ్రీరాముడు ధనుర్బాణాలు ధరించి శత్రుసేనలను సంహరించడం మొదలె ట్టాడు. శ్రీరామ ధనుష్టంకారానికే శత్రుసేనల చెవులకు చెవుడు వచ్చింది.

శ్రీరాముడు ఒక లక్ష బాణాలు వొది లాడు. అవి అన్నీ రెక్కల కాలసర్పాల్లాగా దూసుకు పోయాయి. రాక్షస సేనలు భయపడిపోయాయి. కాళ్లు, చేతులు, తలలు ఎగిరిపోతున్నాయి. ఒక్కొక్క రాక్షస వీరుడు వెయ్యి ముక్కలై పోతున్నాడు. కొంత మంది వీరులు కళ్లు తిరిగి పడిపోతున్నారు. మళ్లీ లేచి యుద్ధం చేస్తున్నారు. రామ బాణాలు తగలగానే మేఘాల్లాగా గర్జిస్తున్నారు. కొంత మంది భయంతో పరుగెత్తి పోతున్నారు.

శ్రీరాముడు క్షణ మాత్రంలో రాక్షస సేనలను సంహరించడం చూసిన కుంభ కర్ణుడు క్రోధావేశంతో గంభీరంగా సింహనాదం చేశాడు. కొండలు కొండలే పెకలించి వానర సేనల మీదకు విసిరి వేస్తున్నాడు. రాముడు తన బాణాలతో వాటి నన్నిటిని ముక్కలు ముక్కలు చేస్తూ వున్నాడు. శ్రీరాముడి బాణాలు కుంభ కర్ణుడి శరీరంలో నుంచి దూసుక

పోతున్నాయి. కుంభ కర్ణుడు కోపంతో వికటాట్ట హాసం చేస్తున్నాడు. వానర భల్లూక సేనలు తోడేలును చూసి గొర్రెపిల్లలు పరుగెత్తినట్లు పరుగెత్తు తున్నాయి.

వానర భల్లూకసేనల అసహాయ స్థితి చూసిన శ్రీరాముడు ధనుర్బాణాలు సవరించుకొని ముందుకు వెళ్లాడు. ఒక వంద బాణాలు సంధానం చేశాడు. బాణాలు దూసుక పోయాయి. కుంభ కర్ణుడి శరీరంలో గుచ్చుకున్నాయి. బాణాల తాకిడికి కోపంతో పరుగెత్తాడు. అతడు పరుగెత్తడంతో పర్వతాలు అదిరాయి. భూమి కంపించింది. ఒక పర్వతం పెకలించాడు. అంతలో శ్రీరాముడు వాడి కుడి భుజాన్ని విరగ్గొట్టేశాడు. అంతలో వాడు ఎడమభుజంతో పర్వతాన్ని ఎత్తుకొని బయలుదేరాడు. అందు మీదట ప్రభువు ఆ రెండో భుజాన్ని కూడా విరగ్గొట్టేశాడు.

రెక్కలు విరిగిన మందర పర్వతం లాగా భూమ్మీద కూలిపోయాడు. ముల్లోకాలను మింగి వేద్దామన్నంత కోపంగా రాముడి వైపు చూశాడు. భయంకరంగా రంకె వేస్తూ నోరు తెరచుకొని పరుగెత్తాడు. ఆకాశంలో దేవతలు కూడా హాహా కారాలు చేశారు.

దేవతల హాహాకారాలు విన్న రాముడు కుంభకర్ణుడి నోటిని బాణాలతో నింపి వేశాడు. అయినా కూడా ఆ మహాబలుడు భూమ్మీద పడలేదు సరి గదా, రాముడి మీదకు హుంకరించాడు. వెంటనే రాముడు తీక్షణమైన బాణంతో వాడి తలను మొండెం నుంచి వేరు చేశాడు.

కుంభ కర్ణుడి శిరస్సు ఎగిరి పోయి రావణాసురుని వద్ద పడిపోయింది. ఆ శిరస్సును చూడగానే రావణుడు మణిని పోగొట్టుకొన్న సర్పంలాగా బాధ పడిపోయాడు. ప్రచండమైన కుంభ కర్ణుడి మొండెము పరుగెత్తడం మొదలెట్టింది. దాంతో భూమి కుంగిపోతూ వుంది. వెంటనే రాముడు ఆ మొండాన్ని రెండు ముక్కలుగా విరగ్గొట్టాడు. అప్పుడు ఆ రెండు ముక్కలూ రెండు పర్వతాల్లాగా నేల కూలాయి. అందని తేజము శ్రీ రామచంద్రునిలో లీనమై పోయింది. దేవతలు మునులు ఆశ్చర్యపోయారు. దేవతలు నగారాలు మ్రోగిస్తూ ఆనందంతో కీర్తిస్తూ పూల వాన కురిపించారు.

రావణాసురుడు కుంభకర్ణుడి శిరస్సును హృదయానికి హత్తుకొని భోరు భోరున ఏడుస్తున్నాడు. స్త్రీ లందరూ గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నారు. అప్పుడు మేఘనాధుడు అక్కడికి వచ్చి తండ్రిని ఓదార్చాడు. రేపటి యుద్ధంలో నా ప్రతాపం చూపిస్తానన్నాడు.

మర్నాడు తెల్లవారగానే వానరులు లంక నాలుగు ద్వారాలు ముట్టడించారు. ఒక వైపు మృత్యు దేవత ల్లాంటి వానర భల్లూకాలు, మరొక వైపు యుద్ధ వీరులైన రాక్షసులు చేరారు.

మేఘనాధుడు మాయారథం ఎక్కి ఆకాశంలోకి వెళ్లిపోయాడు. అక్కడి నుంచి వికటాట్ట హాసం చేశాడు. అది విని వానర సేనలకు భయం కలిగింది. మేఘనాధుడు రకరకాలైన అస్త్రాలు విసుర్తూ వున్నాడు. ఆకాశంలో ఎటు చూసినా బాణాలే! 'పట్టుకోండి, కొట్టండి, చంపండి.' అనే మాటలు వినవస్తున్నాయి.

కాని మనిషి కనిపించడం లేదు. వానరులు చెట్లు, రాళ్లు చేత బట్టుకొని ఆకాశంలోకి పరుగెత్తు తున్నారు. కాని మేఘనాధుడు కనిపించక వెనక్కు తిరిగివస్తున్నారు.

మేఘనాధుడి తాకిడికి ఒక వైపున హనుమంతుడు, నలుడు, నీలుడు మొదలైన వారంతా వ్యాకులత చెందారు. మరొక వైపున లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు మేఘనాధుని బాణాల తాకిడికి రక్తసిక్తమై పోయారు.

మేఘనాధుడు శ్రీరాముడితో యుద్ధానికి తలపడ్డాడు. సర్పాల్లాంటి బాణాలు వొదులుతున్నాడు. స్వతంత్రుడు, అద్వితీయుడు-అయిన రాముడు నటన ద్వారా అనేక లీలలు చేస్తూ వున్నాడు. మేఘనాధుని నాగపాశానికి బద్దుడై పోయాడు. అది చూసి దేవతలు భయ పడిపోయారు. అప్పుడు నారదుడు గరుత్మంతుణ్ణి పంపాడు. గరుత్మంతుడు వచ్చి నాగపాశాన్ని ఛేదించి వేశాడు. మాయ అంతా తొలగిపోయింది. వానర సేనలు విజృంభించాయి.

అప్పుడు మేఘనాదుడు అజయ యజ్ఞం చేయ సంకల్పించి ఒక కొండ గుహలో జొర బడ్డాడు.

ఇది తెలుసుకొన్న విభీషణుడు రాముని వద్దకెళ్లి "మేఘనాధుడు అపవిత్ర యజ్ఞం చేస్తున్నాడు. అతడు ఆ యజ్ఞం పూర్తి చేసి నట్లయితే అతణ్ణి చంపడం కష్టమవుతుంది" అని చెప్పాడు.

అప్పుడు రాముడు, అంగదుడు మొదలుగా గల వానర వీరులను పిల్చి లక్ష్మణుని వెంట వెళ్లి ఆయజ్ఞాన్ని ధ్వంసం చెయ్యమన్నాడు. దేవతలంతా భయంతో వున్నారు గనక మేఘనాధుణ్ణి హత మార్చమని లక్ష్మణునితో చెప్పాడు. జాంబవంతుణ్ణి, సుగ్రీవుణ్ణి, విభీషణుణ్ణి సేనా సహితంగా తోడుగా వుండమని చెప్పాడు.

అన్న ఆజ్ఞతో లక్ష్మణుడు ధనుర్బాణాలు చేత పట్టుకొని రామ ప్రతాపాన్ని మనస్సునందు స్మరించు కుంటూ-ఈ రోజు నేను మేఘనాధుణ్ణి చంపకపోతే రామ సేవకుడినే కాదు- అని ప్రతిజ్ఞ చేసి రాముని పాదాలకు నమస్క రించి బయలుదేరాడు. అంగదుడు, నలుడు, నీలుడు, మయందుడు, హనుమంతుడు వెంట నడిచారు.

మేఘనాధుడు యజ్ఞం చేస్తూ వున్నాడు. పశువులను బలి ఇచ్చి రక్తాన్ని అర్పిస్తూ వున్నాడు. వానరులు వెళ్లి ఆ యజ్ఞాన్ని ధ్వంసం చేశారు. అయినా సరే మేఘనాధుడు దీక్షలో నుంచి లేవ లేదు. అప్పుడు వానరులు అతడి జుట్టు పట్టి ఈడ్చారు. కాళ్లతో తన్నారు. దాంతో మేఘనాధుడు త్రిశూలం తీసుకొని వానరులను తరుము కున్నాడు. వానరులంతా పరుగెత్తి లక్ష్మణుని వద్దకు వచ్చారు.

మేఘనాధుడు తన త్రిశూలాన్ని లక్ష్మణుని పైన విసిరాడు. లక్ష్మణుడు తన బాణంతో దాన్ని రెండు ముక్కలు చేశాడు. హనుమంతుడు, అంగదుడు మేఘనాధుణ్ణి కొట్టడం మొదలెట్టారు. అయినా మేఘనాధునికి దెబ్బ తగలటంలేదు. ఎంత కొట్టినా చావడం లేదు. ఇంతలో మేఘ నాధుడు రంకెలు వేస్తూ, మృత్యు దేవతలాగా వురుముతూ

లక్ష్మణుని మీదకు వచ్చాడు. లక్ష్మణుడు వెంటనే భయంకర బాణాన్ని వొదిలాడు. వజ్రాయుధం లాంటి ఆ బాణం రావడం చూసిన మేఘనాధుడు మాయమై పోయాడు. క్షణం కనిపిస్తూ క్షణం మాయ మవుతూ యుద్ధం చేస్తూ వున్నాడు.

మేఘనాధుడు ఎంతకూ చావక పోవ డంతో వానరులంతా భయపడిపోయారు. చూశాడు లక్ష్మణుడు. చాలా కోపం వచ్చింది. ఇక వీడి ఆట కట్టించాలను కున్నాడు. రామప్రతాపాన్ని స్మరించాడు. వీరోచిత పౌరుషంతో బాణం ఎక్కు పెట్టాడు.

లక్ష్మణుడి బాణం సూటిగా వెళ్లి మేఘనాధుడి గుండెల్లో గుచ్చుకొంది. చస్తూ చస్తూ తన మాయనంతా వొదిలి వేశాడు. 'రాముడెక్కడ? లక్ష్మణుడెక్కడ? అంటూ ప్రాణాలు వొదిలాడు.

వానరులంతా సంతోషించారు. హనుమంతుడు మేఘనాధుని కళేబరాన్ని సునాయాసంగా లేవనెత్తి తీసుకెళ్లి లంకా ద్వారం వద్ద వుంచి వచ్చాడు. ఈ వార్త వినగానే దేవతలు, గంధర్వులు విమానాలు ఎక్కి ఆకాశం మీదకు వచ్చారు. పూల వాన కురిపించి నగారాలు మోగించారు. లక్ష్మణుడు సంతోషంగా రాముని వద్దకు చేరుకొన్నాడు.

మేఘనాధుని మరణవార్త వినగానే రావణాసురుడు మూర్ఛపోయాడు. మండోదరి గుండెలు బాదుకుంటూ ఏడ్వడం మొదలెట్టింది. నగరంలోని రాక్షసులంతా దుఃఖపోయారు. అందరూ రావణుణ్ణి దూషిస్తున్నారు.

మర్నాడు తెల్లవారగానే వానరులంతా లంకా ద్వారం వద్ద చేరారు. యుద్ధానికి తలపడ్డారు. రావణుడికి తెలిసిపోయింది. సేనలను సమాయత్తం చేశాడు. వాయువేగంతో వెళ్లే రధం సిద్ధం చేసుకొన్నాడు. యుద్ధ భేరీలన్నీ మోగుతున్నాయి. అమిత బలవంతుడు రావణుడు యుద్ధానికి బయలుదేరాడు. దారిలో అన్ని రకాల అపశకునాలు అయ్యాయి. కాని తన భుజబలం పైన గర్వంగల రావణుడు లెక్క చేయలేదు. ఆయుధాలు చెయ్యి జారి క్రింద పడిపోతున్నాయి యోధులు రధాల్లో క్రింద నుండి క్రింద పడిపోతున్నారు. గుర్రాలు, ఏనుగులు అదుపు తప్పి సకిలిస్తూ, ఘీంకరిస్తూ పరుగెత్తుతున్నాయి. నక్కలు, గద్దలు, కాకులు, గాడిదలు అరుస్తూ వున్నాయి. కుక్కలు మొరుగు తున్నాయి. గుడ్లగూబలు అరుస్తూ చావు మూడిందని తెలియ చేస్తున్నాయి.

అపారమైన రాక్షస సేన బయలు దేరింది. చతురంగ సేనలో అనేక విభాగాలున్నాయి. అనేక రకాల వాహనాలున్నాయి. రకరకాల రంగు రంగుల జండాలు ఎగురుతున్నాయి. మదించిన ఏనుగుల గుంపు బయలు దేరింది. శూర వీరులైన యోధులు బయలుదేరారు. రకరకాలైన మాయలు ఎరిగిన వారున్నారు. చిత్ర విచిత్రమైన సైన్యాలు శోభాయమానంగా వున్నాయి. వీర వసంత రాయలే సేనలను అలంక రించాడన్నట్లు వున్నాయి

( ఇంకా ఉంది )

# వివాహ ముహూర్త లగ్న నిర్ణయము – దాంపత్యము

రచన : శ్రీ నత్రతసాల వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

దాంపత్యమునకు మూలము వివాహము. వివాహమునకు, ముహూర్త లగ్న నిర్ణయము అతి ముఖ్యము. లగ్న నిర్ణయము, శుభ ప్రదమైన, దాంపత్యము శుభకరమై, సుమధురమై వుండగలదు.

సకల విద్యాపారంగతులు మహిమాన్వితులు ఋషి, యోగ-పుంగవులచే నిర్దేశిత మైనదే ముహూర్త లగ్న నిర్ణయము. ముహూర్తములకు సదా కొన్ని కట్టుబాట్లు కలవు. అవి ఏవనగా ముహూర్త నిర్ణయము నందు పంచక రహితమును పాటించుట, తారాబల, చంద్రబలమును చూచుట, తిథి, వార, నక్షత్ర లగ్నములను పరిశీలించుట ఎంతయో ముఖ్యము.

ప్రధానముగా పంచకరహితమనగా ఏమిటో తెలుసుకొందము. 1.శుద్ధపాడ్యమి లగాయితు తిథియును 2.ఆదివారము మొదలు వారమును 3.అశ్వని నక్షత్రము మొదలు నక్షత్రమును 4. మేషము లగాయితు ముహూర్త లగ్నమును వరుసగా లెక్కించి పై కనపరచిన నాలుగు సంఖ్యలను కూడగా వచ్చిన మొత్తము సంఖ్యను, 9 చే భాగించగా మిగలిన శేషమును పంచకమని అందురు. 3,5,7,9 శేషము మిగిలిన అది పంచక రహితము. అది సర్వదా శ్రేష్ఠమని శాస్త్ర సమ్మతము. మిగిలిన 1,2,4,6,8 శేషము మిగిలిన అది పంచక రహితము కాదు. అది శుభత్వమును చేకూర్చదు.

పంచక రహితముకాని అశుభ శేషత్వములను గమనించుట చాలా ముఖ్యము. ఒకటి శేషము మిగిలిన మృత్యుపంచకమనియు, రెండు శేషము మిగిలిన అగ్ని పంచకమనియు, నాలుగు శేషము మిగిలిన రాజ పంచకమనియు, ఆరు శేషము మిగిలిన చోర పంచకమనియు, ఎనిమిది శేషము మిగిలిన రోగ పంచకమనియు శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

రాజ పంచకమును కొన్ని సందర్భములందు తీసికొనుట మనము అప్పుడప్పుడు గమనించుట కద్దు. అది దోష రహితమని కొందరి వాదన. కాని దోష రహిత పంచకములు వివాహ నిర్ణయ సందర్భములందు సర్వదా అనుసరించుట చాలా యోగ్యదాయకము.

"పక్ష చ్ఛిద్రములు" ను సహా వివాహ శుభ సందర్భములందు గమనించుట యోగ ప్రదము. చవితి, షష్ఠి, అష్టమి, ద్వాదశి, చతుర్దశి, ఈ ఐదు తిథులు పక్ష చ్ఛిద్రములని పిలుతురు. ఈ తిథుల యందు వివాహము చేయుట శుభ ప్రదము కాదనియు, అది అనర్థములకు దారి

తీయగలదని మహర్షుల భావన.

"జామిత్ర శుద్ధి"ని ఆచరించుట చాలా శుభప్రదమని పంచాంగ కర్తలు నుడుగుదురు. జామిత్రశుద్ధి అనగా లగ్నము లగాయితు ఏడవ రాశియందు ఏ గ్రహమూ లేకుండా వుండుటయే. అది అన్ని విధముల సర్వ శుభములను చేకూర్చును. "జామిత్ర శుద్ధి"ని శాస్త్రవేత్తలు ఎక్కువగా పాటింతురు. కారణము వివాహ లగ్న సమయమునందు ఒక పరి ఏడింట రవి వున్న వైధవ్యము, చంద్రుడున్న సవతి పోరు, కుజుడు, శని వున్న మరణము, బుధుడున్న పుత్ర నష్టము, గురుడున్న సర్వనాశనము, రాహుకేతువులున్న కారాగార ప్రాప్తి, శుక్రుడు వున్న రోగము, దంపతులకు కలుగునని శాస్త్రము.

వృషభము, మిధునము, కర్కాటకము, సింహము, కన్య తుల, ధనస్సు, కుంభము ఈ లగ్నముల యందు వివాహము చేయుట సర్వత్రా శుభమును కూర్చును. కర్కాటకము, కన్య, ధనస్సు, కుంభ రాశులయందు రవి లేని సమయములను సహా గుర్తించుట చాలా ముఖ్యము. రవి వున్న అది అంత శుభప్రదము కాదు.

గురు, శుక్ర, మౌఢ్యములందు వివాహము చేయుట వర్జితము. అనగా గురువుతోకాని, శుక్రునితోకాని, రవి చేరి యుండరాదు. ముఖ్యముగా శుభ గ్రహములగు పూర్ణ చంద్రుడు గురువు, శుక్రుడు, బుధుడు, కేంద్ర కోణముల యందు అనగా 1,4,10,5,9 మరియు 2,11 రాశులయందు వుండుట చాలా ముఖ్యము. పాప స్థానములందు 3,6, మరియు 11ట పాప గ్రహములు అనగా క్షీణ చంద్రుడు రవి, కుజ, శని, రాహువులు వుండుట వివాహ లగ్నమునకు అతి ముఖ్యము.

వివాహ లగ్న నిర్ణయములందు తారాబలము, చంద్రబలములను గమనించుట చాలా యోగ్యము, శ్రేయోదాయకము.

తారాబలమనగా వధూవరులకు జన్మ నక్షత్రము మొదలు నిత్య నక్షత్రము వరకు లెక్కించి 9చే భాగించగా 2,4,6,8,9 శేషములు వచ్చిన అవి వివాహమునకు కడు యోగ్యము. మిగిలిన శేషములు వర్జితములు.

| తార శేషము | ఫలితము |
|---|---|
| 1. జన్మతార | శరీర నాశనము |
| 2. సంపత్తార | ఐశ్వర్యము |
| 3. విపత్తార | కార్యనాశనము |
| 4. క్షేమతార | క్షేమ లాభములను సమకూర్చును. |
| 5. ప్రత్యత్తార | కార్యనాశనము |
| 6. సాధన తార | కార్య విజయము |
| 7. నైధన తార | మరణము |
| 8. మిత్ర తార | సౌఖ్యము |
| 9. పరమ మిత్రతార | సుఖము |

## సులభముగా గ్రహించుటకు తారాబల నిర్ణయ పట్టిక

| జన్మ లేక నామ నక్షత్రాలు | | | నిత్య నక్షత్రములు | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | అశ్వని | భరణి | కృత్తిక | రోహిణి | మృగశిర | ఆర్ద్ర | పునర్వ | పుష్యమి | ఆశ్లేష |
| | | | మఖ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త | స్వాతి | విశాఖ | అనూరా | జ్యేష్ట |
| | | | మూల | పూ.షాడ | ఉ.షాడ | శ్రవణం | ధనిష్ట | శతభిషం | పూ.భాద్ర | ఉ.భాద్ర | రేవతి |
| అశ్వని | మఖ | మూల | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| భరణి | పుబ్బ | పూ.షాడ | 9 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| కృత్తిక | ఉత్తర | ఉ.షాడ | 8 | 9 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| రోహిణి | హస్త | శ్రవణం | 7 | 8 | 9 | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| మృగశిర | చిత్త | ధనిష్ట | 6 | 7 | 8 | 9 | 1 | 2 | 3 | 4 | 5 |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం | 5 | 6 | 7 | 8 | 9 | 1 | 2 | 3 | 4 |
| పునర్వసు | విశాఖ | పూ.భాద్ర | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 1 | 2 | 3 |
| పుష్యమి | అనూరాధ | ఉ.భాద్ర | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 1 | 2 |
| ఆశ్లేష | జ్యేష్ట | రేవతి | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 1 |

ఉదా :- జాతకుని జన్మ నక్షత్రము "భరణి" అనుకొనుము. తారా బలము నిర్ణయించు దినము నాడు అనగా ఆనాటి నిత్య నక్షత్రము కృత్తిక అనుకొనుము. పట్టిక యందు 2 తార వచ్చినది. అనగా అది సంపత్తార. శుభప్రదము. ఐశ్వర్యమును గూర్చును. అని తెలుసుకొనుము.

చంద్రబలము అనగా జన్మ రాశికి 1,3,6,7,10,11 రాశులందు చంద్రుడు వుండుట. శుక్ల పక్షమునందు 2,5,9 రాశులందు చంద్రుడు వుండుట. కృష్ణ పక్షములందు 4, 8, 12 రాశులందు చంద్రుడు వుండుటనే చంద్రబలమని అందురు. అది దంపతులను సర్వదా కాపాడునని శాస్త్రములు చెప్పును.

వివాహ కార్యములు శూన్య మాసము లందు చేయుట వర్జితము. శూన్య మాసమనగా రవి సంచరించు మాసమని గుర్తించుము.

1. చైత్ర మాసము ... మీనరాశియందు రవి వుండుట.
2. ఆషాడ మాసము ... మిధున రాశి యందు రవి వుండుట.
3. భాద్రపద మాసము ... కన్యా రాశి యందు రవి వుండుట.
4. పుష్య మాసము ... ధనూరాశి యందు రవి వుండుట.

పై రాశులయందు రవి సంచరించు సమయములందు వివాహమొనర్చిన దంపతులకు అనర్థము జరుగునని మహర్షుల అభిప్రాయము.

వారములయందు బుధవారము, గురు వారము, శుక్రవారము ఉత్తమమనియు, సోమ, ఆదివారములు మధ్యమమనియు, మంగళ, శని వారములు అధమ మనియు పైగా దోష జనితమైనవనియు వివాహము లయందు వర్జితములనియు శాస్త్రములు తెలుపును. కేంద్రములయందు

ారుడున్న లక్షదోషములు నివారితమగు నని కొందరు చెప్పుదురు. అది మాత్రమే అంత శుభ ప్రదము కాదని పై కనపరచిన విషయములను సదా ఆచరించుట మంచిదని వేద విధుల భావన.

ఇట్లు అనేక క్రమబద్ధములతో కూడి యున్నవి కాననే వాటిని బాగుగా శోధించి వివాహలగ్న నిర్ణయమును కావించుకొనుట ఎంతయో శ్రేయోదాయకము.

"కీడెంచి మేలెంచుము" అని ఆర్యోక్తి. చాలావరకు దాంపత్యము శుభకరము, మంగళకరము కావలయును అంటే లగ్న సమయమును ఛాలా ముఖ్యము.

ఏది ఎట్లున్నను శాస్త్రముపై నమ్మకము లేనివారు, వితండవాదులు, "శ్రీరామ పట్టాభిషేక"విషయమై పలు వాదనలు చేయుదురు. మహాజ్ఞాని, సర్వశాస్త్ర నిపుణుడు, భూత, భవిష్యత్, శాస్త్రనిర్ణేత, రఘువంశ కుల గురువు వశిష్ట మహాముని "రామ పట్టాభిషేక" ముహూర్తమును నిర్ణయించి, ఆ ముహూర్తమునకే ఆదర్శ మూర్తులయిన సీతారాములను అడవి పాలు గావించాడు. అదేమి లగ్నము? అదేమి ముహూర్తము? అని శాస్త్రములను దుమ్మెత్తిపోసి లగ్న నిర్ణయము ఒక మూఢా చారమని మనసుల కలయికయే మహో న్నతమని దానికి లగ్న నిర్ణయముతో పనిలేదని, పసలేని వాదనలను గావింతురు.

వారి అజ్ఞానమునకు నవ్వవలయునో, ఏడ్వవలయునో తెలియకున్నది. నిశిత జ్ఞాన దృష్టిచే పరిశోధిస్తే మహిమాన్విత డైన రఘువంశ కుల గురువు వశిష్టుల వారి దూర జ్ఞాన దృష్టికి జోహారు అనుట తప్పదు. సాధారణ సామాన్య శాస్త్ర వేత్తలు శ్రీరాములవారి పట్టాభిషేక ముహూర్తమును నిర్ణయించివుంటే, రాముడు ఈనాడు రఘుకుల రాముడు కాని, దశరథ రాముడు కాని, అయోధ్యరాముడు కాని అయి వుండే వాడే కాని వేరు రాముడు అయి వుండే వాడు కానే కాడు.

మహాజ్ఞాని, అఖిల సర్వశాస్త్ర పారంగ తుడు, గురువులకే గురువు అయిన శ్రీ వశిష్టుల వారు శ్రీరాముల వారి పట్టాభిషేక ముహూర్తమును జ్ఞాన దృష్టిచే నిర్ణ యించుట చేతనే ఆనాడు, శ్రీ సీతారాముల వారు అరణ్యవాసము చేయడము, లోక కంటకులయిన రాక్షస వధ కావించడము, అరివీర పరాక్రముడైన రావణ సంహారము చేయడము, పరమసాధ్వి, పతివ్రతా శిరోమణి అయిన మన తల్లి సీతాసాధ్వి పవిత్రత లోక విదితమై, వారి జంట లోక పూజ్యతనొంది నేటికీ సహా ఆదర్శ దంపతులుగా వాసికెక్కి పూజలందు చున్నారు. లోక కళ్యాణ మహాచక్రవర్తిగా యుగయుగాల పర్యంతము శ్రీరాముల వారు నభూతో నభవిష్యతి అనునట్లు నవ్య శోభతో, విరాజిల్లుతూ వున్నారంటే ఆ మహిమాన్వితుడైన వశిష్ఠుల వారి లగ్న ప్రభావమెట్టిదో ఈ వరకే, పాఠకులు గ్రహించియుందురు.

దివ్యాత్మ స్వరూపులారా! భగవంతుని యందు నమ్మకము గల మహిమాన్వితు లారా! మహాఋషుల వాక్యములు సూనృత ములని నమ్మి మధురమును, పవిత్రతను, కూడుకొన్న కళ్యాణ సంధానము పరమ శుభాన్వితమని గ్రహించి లగ్న నిర్ణయ మును, పాటించి, పరమాత్ముని కృపకు పాత్రులుకండు.

## స్వీకారం

### శ్రేయార్థి జమ్నాలాల్ బజాజ్

హిందీలో శ్రీ హరిభామా ఉపాధ్యాయ గారు రచించిన జమ్నాలాల్ బజాజ్ గారి చరిత్రను నెల్లూరు జిల్లా గూడూరు వాస్తవ్యులు శ్రీ గాధం శెట్టి శ్రీరాములు గారు "శ్రేయార్థి జమ్నాలాల్ బజాజ్" అను పేర అనువదించి, తానే ముద్రించిన పుస్తకం మా కార్యాలయం చేరింది. గత రెండు సంవత్సరాలుగా ఈ పత్రికలో "రామచరితమానసము"ను చదువుచున్న మా పాఠకులకు శ్రీరాములు గారి అనువాద విధానములోని మాధుర్యము, సరళత తెలిసిందే. ఒక మహాత్యాగిని, ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధున్ని తెలుగు పాఠకులకు పరిచయంచేస్తున్న శ్రీరాములు గారు ప్రశంసనీయులు. వెల రూ.20/-లు శ్రీ జి.శ్రీరాములు, రిటైర్డు లెక్చరర్, డబ్ల్యు 4/205, బ్రాహ్మణవీధి, గూడూరు - 524 101.కి వ్రాసి ప్రతులను పొందవచ్చు.

### "భాగ్యనగరంలో వైశ్యులు - వైశ్య సంస్థలు"

హైదరాబాద్ ప్రధాన కార్యస్థానంగా గల రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ వారు ఈ 1994 ఫిబ్రవరిలో ప్రచురించిన భాగ్యనగరములో వైశ్యులు-వైశ్య సంస్థలు అను పుస్తకం మా కార్యాలయం చేరింది. ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ కె.సి. గుప్త గారి సంపాదకత్వమున వెలువడిన ఈ పుస్తకములో హైదరాబాద్-సికింద్రాబాద్ జంట నగరాలలోని వైశ్య ప్రముఖులు అనేకుల జీవిత చరిత్రలు ప్రజా సేవ చేస్తున్న పలు వైశ్య సంస్థల వివరాలు ఉన్నవి. వెల రూ.10/-లు. పై సంస్థలో వంద రూపాయలు చెల్లించి సభ్యత్వాన్ని స్వీకరించిన వారు ఈ పుస్తకాన్ని ఉచితంగా పొందవచ్చు. ప్రాప్తిస్థానము కె.సి. గుప్త, 4-7-324, ఇస్సామియా బజార్, హైదరాబాద్ - 500 027.

**వివాహం**

హైదరాబాద్ వైశ్య ప్రముఖులు, ప్రసిద్ధ కాంట్రాక్టర్లు "నిర్మాణరత్న" శ్రీ మేడా నరసింహులు గారి కుమార్తె చి॥వాణిశ్రీ వివాహం, హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీ చింతా రాజేశ్వర రావు గారి కుమారులు చి॥ రామకృష్ణ బి.టెక్., యం.యస్.,(యు.యస్.ఎ) గారితో 31.3.1994వ తేదీన హైదరాబాద్‌లోని "హోటల్ హాలిడే ఇన్ క్రిష్ణా"లో వైభవంగా జరిగింది.

## చక్కెర వ్యాధి, రక్తపోటు (బీ.పి.) పూర్తిగ బాగైనది.


డా. గ్రంధే రఘురామ గుప్త

'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంధే రఘురామగుప్త గారికి, (మార్కాపురం. ప్రకాశం జిల్లా – 523 316.)

అర్యా !

నమస్సులు. నేను 20 సం॥లుగ బి.పి. తోను 10 సం॥లు పైగా షుగర్ వ్యాధితోను పీడింపబడితిని. ఎన్నో విధములగు ఔషధములు సేవించితిని. మద్రాసులోని డయాబెటిక్ రీసర్చ్ సెంటర్‌కు 3 పర్యాయములున్న, ఢిల్లీలోని రాంమనోహర్ లోహియా ఆస్పత్రిలో ఒకసారి పరీక్షలు చేయించుకొని వారి సలహామేరకు ఔషధములు సేవించితిని. కాని, సదరు మందులు సేవించునంత వరకు మాత్రమే వ్యాధులు తగ్గుచుండెడివి. మీరిచ్చిన ఔషధములు నేను పథ్యము లేకుండ 10 మాసములు సేవించితిని. మీ ఔషధ ప్రభావము వలన, నాకు 6 మాసములకు పూర్తి ఆరోగ్యము కలిగినది. ఇప్పటికి ఒక సం॥నకు పైగా నాకు ఆ రోగ చిహ్నములు లేవు. నేను అపుడపుడు తీపి పదార్థములు కూడ తినుచున్నాను, మీ సిద్ధ వైద్యమునకు నా నమస్కారములు.


డా. జి.వెంకట ప్రసాద్

ఏనుగు చెట్టు వీధి,
ఒంగోలు. ప్రకాశం జిల్లా.
10.7.92.

భవదీయుడు
(Sd.) కొణిజేటి శ్రీమన్నారాయణ,
మాజీ మునిసిపల్ కౌన్సిలర్

## మచిలీ పట్నములో "అమరజీవి" విగ్రహ ప్రతిష్ఠ

కృష్ణా జిల్లాకు ముఖ్య పట్టణమైన మచిలీపట్నము లోని చంపా చెరువు సమీపములో, ఆంధ్ర రాష్ట్ర స్థాపనకు అసువులు బాసి, భాషా రాష్ట్రాల నిర్మాణానికి మూల కారకులైన శ్రీ పొట్టి శ్రీరాములు గారి విగ్రహ ప్రతిష్ఠ ఆయన జన్మదినమైన 16.3.1994వ తేదీన జరిగింది. ఈ సందర్భంగా జరిగిన సభకు ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘముల సమాఖ్య మాజీ అధ్యక్షులు 'వైశ్య బంధు' శ్రీ గుడివాడ వెంకట గున్నయ్య శ్రేష్ఠి గారు అధ్యక్షత వహించారు. రాజ్యసభ మాజీ సభ్యులు శ్రీ కాశీనాధుని పూర్ణ మల్లిఖార్జునులు గారు ఈ కార్యక్రమములో ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీయుతులు ఎన్నకోట రామచంద్ర రావు, చింతకుంట సూర్యనారాయణ, రాచాకుల లక్ష్మయ్య, మాజేటి వెంకట సీతాపతి రావు, గుడివాడ రామచంద్రారావు ప్రభృతులు ఈ కార్యక్రమములో పాల్గొని ప్రసంగించారు. సభాధ్యక్షులు తమ ప్రసంగములో మద్రాసులో జరిగిన పొట్టి శ్రీరాములు గారి అంతిమ యాత్రలో వారి శవ వాహనాన్ని స్మశాన వాటికకు తరలించుటలో పాల్గొనే అదృష్టము కలిగినందుకు సంతోసిస్తున్నాను అన్నాడు.

## ప్రామాణిక ప్రతి బాధ్యత పాండురంగారావుకు

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ప్రామాణిక ప్రతిని రూపొందించు బాధ్యతను "అఖిల భారత వైశ్య చరిత్ర పరిశోధకులు", "విద్యావాచస్పతి" చీరాల వాస్తవ్యులు శ్రీ కొల్లిపర పాండు రంగారావు గారికి శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ అప్ప జెప్పింది.

## తస్మాత్ జాగ్రత్త

### ఆదాయపు పన్ను చట్టము – రిటర్న్లు

వ్యాపారరీత్యాకానీ, వృత్తి వలన కానీ ఆదాయము కలవారు ఈ సంవత్సరము తమ ఆదాయపు పన్ను రిటర్నును ఆగస్టు 31వ తేదీలోగా కాక ఈ (1994) జూన్ 30వ తేదీ లోగానే అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చాలి. గత (1993) అసెస్‌మెంట్ సంవత్సరము వరకు ఈ కాలపరిమితి ఆగస్టు 31వ తేదీ వరకూ ఉండెనది. అసెసీలు ఈ మార్పును జాగ్రత్తగా గమనించి, తమ రిటర్న్లను సకాలములో దాఖలు చేయుటకు తగిన చర్యలు తీసుకోవాలి.

## సదరన్ ట్రావెల్స్ - విజయవాడ శాఖ ప్రారంభం

న్యూఢిల్లీ ప్రధాన కార్యస్థానంగా గల సదరన్ ట్రావెల్స్ వారు విజయవాడలో తమ నాలుగవ శాఖను ఏర్పాటు చేశారు. విజయవాడ పట్టణములోని లబ్బీపేటలో ఏర్పాటు చేసిన ఈ శాఖను పార్లమెంటు సభ్యులు శ్రీ వడ్డె శోభనాద్రీశ్వర రావు గారు 20.3.94వ తేదీన ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన సభకు విజయవాడ చేంబర్ ఆఫ్ కామర్స్ అధ్యక్షులు శ్రీ గడ్డం సుబ్బరావు గారు అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ అధ్యక్షులు శ్రీ కె.వి. రమణయ్య గారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. డాక్టర్ జంధ్యాల మహతీశంకర్, శ్రీ బయన వీర రాఘవరావు, శ్రీ తొండెపు హనుమంత రావు గారలు ప్రసంగించారు.

## శ్రీ భవనాశి శ్రీరామమూర్తి గారికి పితృ వియోగం

కర్నూలు జిల్లా నంద్యాల పుర ప్రముఖులు శ్రీ భవనాశి శ్రీరామమూర్తి గారి జనకులు శ్రీ వెంకట సుబ్బయ్య శ్రేష్ఠి గారు 27.3.1994వ తేదీన స్వర్గస్తులయ్యారు.



## రిటైర్డు టీచర్ల నిరాహార దీక్ష - మే 1న

చిరకాలంగా అపరిష్కృతంగా ఉన్న తమ ప్రధాన సమస్యల పరిష్కారములో ప్రభుత్వము చూపిస్తున్న ఉదాసీన వైఖరికి నిరసనగా 1.5.1994వ తేదీ ఉదయం 10 గంటల నుండి ఒక రోజు అనంతపురం మండల రెవిన్యూ ఆఫీసు ముందు పదవీ విరమణ చేసిన ఉపాధ్యాయులు నిరాహార దీక్ష చేయనున్నట్లుగా ఆం.ప్ర. రిటైర్డు టీచర్ల అసోసియేషన్ జనరల్ సెక్రటరీ శ్రీ బి. వెంకట సుబ్బయ్య గారు అనంతపురం జిల్లా కుంటిమద్ది నుండి ఈ పత్రికకు తెలియజేశారు.

## సుబ్బరావు గారు ఎంతో ధన్యులు

ఆర్యా!

కూతుళ్లు, కొడుకులు - తల్లిని, తండ్రిని పొగడని ఈ రోజుల్లో - ఒక కోడలు తన మామను పొగడడం - అందునా సభాముఖంగా తెలుపటం చాలా ఆశ్చర్యకరమయిన విషయం. సుబ్బరావు గారిని గురించి తెలియని విషయాలు ఈ విధంగా చాలా తెలిసినవి. మహనీయులు శ్రీ శిఖాకొల్లు సుబ్బరావు గారు ఎంతో ధన్యులు.

కె.ఎల్. ప్రసాద్
అడ్వకేట్, విజయవాడ.

## వివాహములు

కడప జిల్లా కొండాపురం పుర ప్రముఖులు శ్రీ గ్రంథే రామ మోహన్ రావు గారి కుమార్తె చి॥ ప్రసన్న లక్ష్మి వివాహం, కర్నూలు శ్రీ గుడిపాటి సూర్య నారాయణ గారి కుమారులు చి॥ రవి ప్రసాద్‌తో 21.3.1994వ తేదీన కొండా పురము లోని కన్యాదాత స్వగృహము లోనూ; సదరు రామమోహన్ రావు గారి కుమారులు చి॥ రామమూర్తి ప్రసాద్ గారి వివాహం, నంద్యాల వైశ్య ప్రముఖులు శ్రీ బొగ్గరపు సుధాకర్ గుప్త గారి కుమార్తె చి॥ శోభారాణితో 23.3.1994వ తేదీన నంద్యాల లోని టి.టి.డి. కల్యాణ మంటపములోనూ వైభవంగా జరిగింది.

కర్నూలు లోని ఆంధ్రప్రదేశ్ విద్యుశ్చక్తి సంస్థలో ఏ.డి.ఇ., గారి పని చేస్తున్న శ్రీ ఐ.శ్రీనివాసులు శ్రేష్ఠి గారి కుమార్తె చి॥ పావని జ్యోతి వివాహం, తాడిపత్రి వాస్తవ్యులు శ్రీ ముడియం రామ రంగయ్య గారి కుమారులు చి॥ వేణు గోపాల్, ఎమ్.ఇ., గారితో 19.3.1994వ తేదీన కర్నూలు లోని గీతా మందిరములో వైభవంగా జరిగింది.

*గమనిక :-* ఈ శీర్షికన ప్రకటన కావాలను కునే వారు వివాహ శుభ లేఖతో బాటు రూ.*116/-*లు యం.ఓ. ద్వారా గానీ, డి.డి. ద్వారా గానీ పంపాలి.

## అమ్మకం పన్ను చట్టము తేదీ మార్పు

ఇప్పుడు అమలులో ఉన్న 1957, ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకం పన్ను చట్టములోని 17వ రూలు సబ్ రూలు 1లోని తేదీని మార్చుచూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు 18.1.1994 వ తేదీన యం.యస్. 38 నెంబరు గల ఉత్తర్వును జారీ చేశారు. ఈ మార్పు ప్రకారము ప్రతి నెలా A-2 రిటర్నును పంపవలసిన ప్రతి డీలరూ గతములో వలె ప్రతి నెల 25వ తేదీకి లోగా కాకుండా ప్రతి నెల 20వ తేదీకి లోగా అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారులకు తమ A-2 రిటర్నును చలానాతో బాటు పంపాలి.

## శివపురం రామసుబ్బయ్యకు సతీ వియోగం

కర్నూలు జిల్లా నంద్యాల వైశ్య ప్రముఖులు శ్రీ శివపురం రామసుబ్బయ్య గారి సతీమణి శ్రీమతి అల్లూరమ్మ గారు 19.3.1994వ తేదీన స్వర్గస్థులయ్యారు. వీరికి ఇద్దరు కుమారులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

## (21.4.1994 నుండీ 20.5.1994 వరకు)

మీ వ్యాపార సంస్థ ఇప్పుడు అమలులో వున్న ఆదాయపుపన్ను చట్టములోని 194 విభాగము మేరకు డివిడెండ్ల నుండీ వచ్చు ఆదాయములపై పట్టుకొన్న మొత్తం వివరాలను తెలుపు రిటర్నును అనగా ఫారం నెం. 26 ను పూర్తిచేసి ఈ ఏప్రిల్ నెల 30వ తేదీలోగా చేరునట్లుగా అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి అందజేయాలి.

అమ్మకం పన్ను చట్టానికి సంబంధించి ఈ 1994 వ సంవత్సరం మార్చి నెల 31వ తేదీతో అంతమయ్యే ఆర్థిక సంవత్సరములో రెండు లక్షలకు మించని టర్నోవరు గల వర్తకులూ, ప్రతి నెలా A-2 రిటర్నును పంపని వర్తకులూ తమ సంవత్సరాంతపు వ్యాపార నికర మొత్తము (టర్నోవరు) ను తెలియజేయు ఫారం A-1 ను పూర్తిచేసి ఈ (ఏప్రెల్) నెల 30వ తేదీలోగా అందునట్లుగా అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖ అధికారికి పంపడం మరచిపోరాదు.

మీరు పంపవలసిన A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు ఈ (మే) నెల 20వ తేదీయే చివరిది– ఈ విషయాన్ని మరచిపోకండి. మీరు పంపు A-2 రిటర్నును చలానాతో బాటు కాకుండా చెక్కుతోబాటు పంపాలనుకున్నారా? అయితే ఆ విధంగా A-2 రిటర్నును చెక్కుతోబాటు పంపుటను ఈ మే 15వ తేదీలోగా చేయాలి.

అమ్మకం పన్ను చట్టము క్రింద పొందిన మీ "రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్"ను పునరుద్ధరించు కొన్నారా? లేకుంటే రూ.100/–లు చలానా ద్వారా చెల్లించి మీకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి ఆ చలానాతో బాటు ధరఖాస్తుచేసి, మీ రిజిస్ట్రేషను సర్టిఫికెట్‌ను పునరుద్ధరించుకోండి.

అత్యవసర వస్తువుల చట్టము క్రింద విజిలెన్సు ఆఫీసర్లు చేయు తనిఖీల విషయములో ప్రభుత్వం విడుదలచేసిన మార్గదర్శక సూత్రాల ప్రకారం రెండు (2) లక్షలకు లోపు టర్నోవరు గల వర్తకుల దుకాణాలను విజిలెన్సు ఆఫీసర్లు తనిఖీ చేయరాదు. ఈ సౌలభ్యమును పొందుటకు వీలుగా రెండు లక్షలకు లోపు టర్నోవరు కలిగి 31.3.1994వ తేదీతో అంతమగు ఆర్థిక సంవత్సరము సంవత్సరాంతంగా గల వర్తకులు తమ టర్నోవరును తెలుపు డిక్లరేషనును ఈ నెల 30 వ తేదీ లోగా వారి వారికి సంబంధించిన లైసెన్సింగు అధికారికి పంపడం మరిచి పోకుండా చేయాల్సిన పని అని గుర్తుంచుకోవాలి.

